# THINKING AND DOING

David Horsburgh

# ఆలోచనలు, పనులు

డేవిడ్ హార్స్‌బరో

1. Draw these four shapes on the board. Teach the children the names of the shapes, too. Then get them to trace over the dotted lines in the book. Help them if necessary.

1. ఈ నాలుగు ఆకారాలను బోర్డు మీద గీయండి. వాటి పేర్లు కూడా పిల్లలకు నేర్పించండి. తరవాత ఈ పేజీలోని చుక్కల మీద గీతలు గియ్యమనండి. అవసరమైతే సహాయం చెయ్యండి.

2. Draw on the blackboard a cross, a circle and two lines. Get the children to draw these figures on their slates or notebooks two or three times. Then ask the children to open their books at page 2. Show them how the circle has been done for them. Ask them to fill in the other two shapes in their correct circles. Those who finish quickly can copy the whole page on to their slates or notebooks.

2. బ్లాక్ బోర్డు మీద x, వృత్తం, రెండు గీతలు గియ్యండి. తమ పలకల మీద, నోటు పుస్తకాలలో ఈ ఆకారాలను రెండు-మూడు సార్లు గియ్యమని పిల్లలకు చెప్పండి. తరవాత వాళ్లను వాళ్ల పుస్తకంలోని రెండవ కృత్యం చూడమని చెప్పండి. ఒక వృత్తంలోని బొమ్మను ఎలా గీశారో చెప్పండి. మిగిలిన రెండు వృత్తాలలో బొమ్మలను సరిగా నింపమని చెప్పండి. తొందరగా పూర్తి చేసిన వాళ్లు ఈ మొత్తం బొమ్మని తమ పలక మీద లేదా నోటు పుస్తకంలో గీయమని చెప్పండి.

3. Follow the same procedure as on page 1 and get the children to draw over the dotted lines.

3. 1వ కృత్యంలో సూచించిన విధానాన్ని అనుసరించండి. చుక్కల మీద పిల్లలను గీతలు గీయమనండి.

4. Tell the children that the boy in the corner wants to get the top, but that he must go along the correct path. Tell them that the red lines are high walls and that he cannot climb over them. Then ask them to see if they can find a path without going over the walls. If they find this first maze difficult, you can draw it on the blackboard and explain the process to them; but let them try first without your help.

4. కింద కుడి వైపున ఉన్న పిల్లవాడు బొంగరం దగ్గరకి వెళ్లాలని అనుకుంటున్నాడు. అయితే అతడు సరైన దారిలోనే వెళ్లాలి. దారిలేని చోట గోడ దూకటానికి లేదు. కాబట్టి గోడ దూకనవసరం లేని దారి గుండా వెళ్లాలి. ఈ సమస్య పిల్లలకి కష్టంగా అనిపిస్తే నల్ల బల్ల మీద రాసి చూపించండి. అయితే ముందుగా మీ సహాయం లేకుండా ప్రయత్నించి చూడనివ్వండి.

5. Ask the children to tell you what the things are in the pictures. Then get them to tell you what they are used for and what they are made of. Lots of discussion is possible.

5. బొమ్మలలోని వస్తువుల పేర్లు చెప్పమని పిల్లలను అడగండి. వాటిని ఎందుకు ఉపయోగిస్తారో, వాటిని దేనితో తయారు చేశారో చెప్పమనండి. వీటి గురించి ఎంతో చర్చించవచ్చు.

6. Copy the faces from the left-hand side of the page on to the blackboard. Perhaps you can get one or two children to draw them on the black board, too. Then get the children to follow the lines and draw the correct faces in the spaces provided.

6. ఎడమ చేతి వైపున ఉన్న బొమ్మలను నల్ల బల్ల మీద గీయండి. ఈ బొమ్మలను గీయమని ఒకరిద్దరు పిల్లలను కూడా అడగవచ్చు. తరవాత గీతలను అనుసరించి ఖాళీగా ఉన్న వృత్తాలలో సరైన బొమ్మను గీయండి.

## HOUSES

7. Talk to the children about the different houses illustrated on this page. Then get the children to talk about their own houses and what they are made of.

## ఇళ్లు

7. ఈ బొమ్మలలో చూపించిన రకరకాల ఇళ్ల గురించి పిల్లలతో మాట్లాడండి. తరవాత పిల్లలను వాళ్ల ఇళ్ల గురించి, వాటిని దేనితో చేశారో చెప్పమని అడగండి.

8. Ask the children to follow the lines and draw the correct shapes in the spaces provided.

8. గీతలను అనుసరించి సరైన బొమ్మను ఖాళీ డబ్బాలలో నింపమని పిల్లలకు చెప్పండి.

9. Get the children to make balls of clay. When they have mixed the clay they can roll it into balls between their hands, as one does before making chapattis. Set up sticks as shown, in an open flat place outside the school and get the children to roll the balls at the sticks and try to knock them down.

9. మట్టితో బంతులను చెయ్యమని పిల్లలకు చెప్పండి. మట్టిని ముద్దగా చేసిన తరవాత రొట్టెలు చేసే ముందు ఉండలు చేసినట్టు రెండు అరచేతుల మధ్య మట్టి ఉండలు చెయ్యవచ్చు. బయట చదునుగా ఉన్న ప్రదేశంలో బొమ్మలో చూపించినట్టు కర్రపుల్లలు నిలబెట్టమనండి. కొంచెం దూరం నుంచి మట్టి బంతులను దొర్లించి ఆ పుల్లలను పడెయ్యాలి.

10. Talk to the children about the things which are connected with each other. On the page they should draw a line between each shape and a square. One has been done for them. The drawing in each shape has some connection with a drawing in one of the squares.

10. ఒక దానికొకటి సంబంధం ఉన్న బొమ్మల గురించి పిల్లలతో మాట్లాడండి. రెండు వైపులా ఉన్న వాటిల్లో అలా సంబంధం ఉన్న బొమ్మలను కలపమని చెప్పండి. ఉదాహరణగా ఒకటి చేసి ఉంది.

11. Get the children to draw the shapes at the bottom of the page. It would be better if you drew them on the blackboard first and then get the children to copy them on their slates or notebooks. Then get the children to complete the page by putting the figures in the correct boxes. Check their work. Those who finish early can copy more figures on to their slates or notebooks.

11. పేజీలో కింద ఉన్న ఆకారాలను గీయమని పిల్లలకు చెప్పండి. ముందుగా మీరు వాటిని నల్ల బల్ల మీద గీసి, తరవాత పిల్లలను వాళ్లు పలక మీద, లేదా నోటు పుస్తకంలో గీయమని చెప్పండి. తరవాత గీతలను అనుసరించి పై డబ్బాలలో సరైన బొమ్మలను గీయమని చెప్పండి. వాళ్లు ఎలా చేశారో చూడండి. తొందరగా పూర్తి చేసిన వాళ్లను వాళ్ల పలకలు లేదా నోటు పుస్తకాలలో ఈ బొమ్మలను గీయమని చెప్పండి.

12. This is a page of pictures for you to talk about. Ask the children to look at the page while you are talking. They may not have seen some of the animals such as an elephant or a camel. Tell them something about these animals, and then get them to copy the pictures at the; bottom of the page on to their slates or notebooks. Make sure they know the names of the animals in their mother-tongue.

12. ఈ పేజీలోని బొమ్మల గురించి పిల్లలతో మాట్లాడండి. మీరు మాట్లాడుతున్నప్పుడు ఈ పేజీని చూస్తూ ఉండమని పిల్లలకు చెప్పండి. ఏనుగు, ఒంటె వంటి జంతువులను వాళ్లు చూసి ఉండకపోవచ్చు. వీటి గురించి పిల్లలకు చెప్పండి. తరవాత కింద భాగంలోని బొమ్మలను వాళ్ల పలకల మీద లేదా నోటు పుస్తకంలో గీయమని చెప్పండి. ఈ జంతువుల పేర్లు వాళ్ల మాతృ భాషలో పిల్లలకు తెలిసేలా చూడండి.

13. Ask the children to join shapes to squares as they have done previously. In this case a piece belonging to the drawing in each square has been left out and can be found in a shape. They should join corresponding squares to shapes

13. ఇంతకు ముందు చేసినట్టు వృత్తాలలోని ఆకారాలను డబ్బాలలో ఉన్నవాటితో జతపరచండి. ఇక్కడ డబ్బాలలో ఉన్న బొమ్మలలో లోపించిన ముక్కలు వృత్తాలలో ఉన్నాయి. ఒక ముక్కని దాని అసలు వస్తువుతో జత పరచమనండి.

14. Note that there are two different kinds of triangle and a new shape. Draw these figures on the blackboard make sure the children know the names of the figures. Then get the children to complete the exercise on this page. Children who finish early can perhaps make a similar exercise on their own, and give it to their friends to do.

14. రెండు రకాల త్రికోణాలు ఉన్నాయని గుర్తించమనండి. కొత్త రకం ఆకారం ఉందని కూడా గుర్తించమనండి. ఈ ఆకారాలను నల్ల బల్ల మీద గీయండి. ఈ ఆకారాల పేర్లు పిల్లలకు తెలిసేలా చూడండి. తరవాత ఈ పేజీలోని కృత్యాన్ని పిల్లలను పూర్తి చేయమని చెప్పండి. త్వరగా పూర్తి చేసిన పిల్లలు బహుశా ఇటువంటి మరొక కృత్యాన్ని తయారు చేసి దానిని చెయ్యమని వాళ్ల స్నేహితులకు ఇవ్వవచ్చు.

15. Talk to the children about a potter. If there is a potter near your school take the children to visit him. Tell them about the potter's wheel. Let the children copy some of the pots shown on this page on their slates or notebooks. Mix some clay (see Appendix I) and get the children to mix some. Let the children make whatever things they want to with the clay.

15. కుండలు చేసే వ్యక్తి గురించి పిల్లలతో మాట్లాడండి. మీ దగ్గరలో కుండలు చేసే వ్యక్తి ఉంటే పిల్లలను అతడి దగ్గరకు తీసుకుని వెళ్లండి. కుమ్మరి చక్రం గురించి పిల్లలకు చెప్పండి. ఈ పేజీలో ఉన్న కొన్ని రకాల కుండలను తమ పలకల మీద, లేదా నోట్ పుస్తకాలలో గీయమని చెప్పండి. కొంత మట్టిని ముద్దగా చెయ్యండి (చూడండి అనుబంధం I), పిల్లలను కూడా కొంత మట్టి ముద్దను చెయ్యమనండి. ఆ మట్టి ముద్దతో పిల్లలను తమకు నచ్చిన బొమ్మలను చెయ్యనివ్వండి.

16. Draw some of these faces on the blackboard and get the children to draw them on the blackboard too. Then ask them to connect faces which are similar. One pair has been done for them.

16. వీటిల్లో కొన్ని ముఖాలను నల్ల బల్ల మీద గీయండి. కొంత మంది పిల్లలను కూడా కొన్ని బొమ్మలను నల్ల బల్ల మీద గీయనివ్వండి. ఒకే రకంగా ఉన్న రెండు రకాల ముఖాలను జతపరచమనండి. ఉదాహరణగా ఒక జతను కలిపి చూపించాం.

17. Get the children to look at the page and then get them to do some of the printing shown. If you have a stock of colours and paste (see Appendix I) they can use them, ff not, they can use coloured earth on paper, or on the slates which have first been covered with chalk or any other white powder. Help them to make patterns and figures on their own. Don't try and get them all to make the same patterns.

17. పిల్లలను ఈ పేజీని చూడమనండి. తరవాత వాళ్లని ఇలాంటి ముద్రలు వెయ్యమనండి. మీ వద్ద రంగులు, మైదా జిగురు ఉంటే (చూడండి అనుబంధం I) వాళ్లు వాటిని ఉపయోగించవచ్చు. అవి లేకపోతే కాగితం మీద వాళ్లు దీనిని చెయ్యవచ్చు. లేదా పలకల మీద ఏదైనా తెల్లటి పొడి వేసి వాటిని ఉపయోగించవచ్చు. వాళ్ల సొంత బొమ్మలు, ప్యాట్రన్లు తయారు చేసేలా ప్రోత్సహించండి. అందరూ ఒకేలాంటి ప్యాట్రన్లు వెయ్యకుండా చూడండి.

18. A slightly more difficult maze than the one on page 4. If children find it difficult at first, ask them to look at page 4 and see how they did that one. Those who finish early can try to copy the maze into their books; this is quite difficult.

18. 4వ కృత్యంలో ఉన్న దానికంటే కొంచెం కష్టమైన చిక్కుదారి. ఇది చెయ్యటం మొదట కష్టంగా అనిపిస్తే 4వ కృత్యం ఒకసారి చూసి దానిని ఎలా చేశారో గమనించమనండి. ముందుగా పూర్తి చేసిన వాళ్లు ఈ బొమ్మని వాళ్ల నోట్ పుస్తకాలలోకి దించమని చెప్పండి. ఇది కొంచెం కష్టంగానే ఉంటుంది.

19. Connections as before. Tell children to look carefully at the, symbols before they complete the page.

19. ఇంతకు ముందు లాగే జతపరచాలి. మొదలు పెట్టటానికి ముందు ఈ గుర్తులను జాగ్రత్తగా చూడమని చెప్పండి.

20. Talk to the children about things which are alive and things which are not alive. Ask them to put a small cross in the circles next to things which are not alive.

20. ప్రాణం ఉన్న, ప్రాణం లేని వాటి గురించి పిల్లలతో మాట్లాడండి. ప్రాణం లేనిదాని పక్కన ఉన్న వృత్తంలో ఇంటూ (x) మార్కు పెట్టమనండి.

21. If you have card, cut it into small pieces as shown on this page. If you have no cards try to get children to bring some empty cigarette packets to the class. These can be used instead of the card. Get the children to make a set of snap cards using different shapes for the rules of this game, see Appendix II.

21. మీ దగ్గర పేక ముక్కలు ఉంటే ఇక్కడ చూపించినట్టు చిన్న ముక్కలుగా చెయ్యండి. పేక ముక్కలు లేకపోతే ఖాళీ సిగరెట్టు పెట్టెలు తీసుకుని రమ్మని పిల్లలకు చెప్పండి. పేక ముక్కలకు బదులు వీటిని ఉపయోగించవచ్చు. వీటితో స్నాప్, జత పరిచే ఆట ఆడటానికి ముక్కలు తయారు చెయ్యమని పిల్లలకు చెప్పండి. ఆట ఆడే విధానం కోసం అనుబంధం II చూడండి.

22. A first introduction to the idea of numbers. You might have introduced these concepts already, Note that the idea of a number is not at first to be connected with the symbols. The symbols for the numbers (1, 2, 3, etc) will come later.

22. అంకెలకు ఇది తొలి పరిచయం. ఈ భావనలను ఇంతకు ముందు మీరు పరిచయం చేసి ఉండవచ్చు. అంకెలను సంఖ్యా గుర్తులతో ముందుగా చెప్పకూడదు. సంఖ్యలు గుర్తులు (1, 2, 3, వంటివి) తరవాత వస్తాయి.

23. Get the children to make whatever they like, animals, birds, household utensils, fruit, vegetables, etc. out of clay. Do not help them too much.

23. మట్టి ముద్ద ఉపయోగించి వాళ్లకి ఇష్టమైన జంతువులు, పక్షులు, పళ్లు, గిన్నెలు, కూరగాయలు వంటివి చెయ్యమని పిల్లలకు చెప్పండి. మీరు ఎక్కువగా సహాయం చెయ్యవద్దు.

24. By now the children should be able to solve this maze, although it is much more complicated than the ones they have had before. Let them try it with the blunt end of their pencils or their fingers before they draw pencil lines along the correct path.

24. ఇంతకు ముందు ఇలాంటి సమస్యల కంటే ఇది ఎంతో క్లిష్టమైనది. అయినప్పటికీ, దీనిని పరిష్కరించ గలిగే స్థితిలో పిల్లలు ఉంటారు. ముందుగా తమ వేలితో లేదా పెన్సిల్ రెండవ వైపుతో చేసి చూడమనండి, తరవాత సరైన దారి వెంట పెన్సిలుతో గీత గీయవచ్చు.

25. Ask the children to look at the page and see if they can tell you how the printing has been done. Even at This early stage it is important to persuade the children to get their own information from the page before you tell them. Have ready one or two ladies fingers, or other vegetables. Cut sections of the vegetables and get the children to make their own prints, as they did on page 17. (For colours see Appendix I)

25. ఈ పేజీ చూసి ఈ అచ్చులు ఎలా వేశారో చెప్పగలరేమో పిల్లలను అడగండి. మీరు చెప్పటానికి ముందు పేజీ చూసి పిల్లలు ఏమి అర్థం చేసుకున్నారో చెప్పమనడం ముఖ్యం. ఒకటి, రెండు బెండకాయలు, ఇతర కూరగాయలు సిద్ధంగా ఉంచుకోండి. ఆ కూరగాయలను అడ్డ కోత కోసి వాటితో పిల్లలను 17వ కృత్యంలో లాగా అచ్చులు వెయ్యమని చెప్పండి. (రంగుల కోసం అనుబంధం I చూడండి.)

26. Each row or pictures has one picture which is not in the same group as 1he other three. For example, in the first row three of the squares have trees in them and one square has a leaf. The leaf is not a member of the tree group and so a cross has been put underneath it. Get the children to put crosses under the odd-man-out for each row. If there is time you can draw some of your own on the blackboard.

26. ప్రతి అడ్డ వరసలో ఆ కోవకి చెందని (వేరేగా ఉండే) ఒక బొమ్మ ఉంది. ఉదాహరణకు మొదటి అడ్డ వరసలో మూడు చెట్లు, ఒక ఆకు ఉన్నాయి. చెట్ల కోవకు ఆకు చెందదు. దానికి ఇంటూ (x) గీత పెట్టి, మిగిలిన వాటికి టిక్కు మార్కు పెట్టి ఉంది. మిగిలిన అడ్డ వరసలలో కూడా ఆ కోవకు చెందని వాటి కింద ఇంటూ మార్కు పెట్టమని పిల్లలకు చెప్పండి. మీకు సమయం ఉంటే నల్ల బల్ల మీద ఇలాంటివే మరికొన్ని బొమ్మలు వెయ్యండి.

27. Ask the children to look carefully at the page first and see if they can to find out what is to be done. Bring one or two leaves to the class, sit near the children and show them how to trace round the leaves with a pencil. Then get the children to make patterns as shown. If they have colours the patterns can be coloured.

27. ఈ పేజీని ముందుగా జాగ్రత్తగా చూడమని పిల్లలకు చెప్పండి. ఏం చెయ్యాలో వాళ్లకి అర్థమయ్యిందేమో అడగండి. తరగతికి ఒకటి, రెండు ఆకులు తీసుకుని రండి. పిల్లల పక్కన కూర్చుని ఆకు చుట్టూ పెన్సిలుతో గీత గీయటం ఎలాగో చూపించండి. తరవాత పిల్లలను ఇలాంటి ప్యాట్రన్లు చెయ్యమని చెప్పండి. వాళ్ల దగ్గర రంగులు ఉంటే వీటికి రంగులు వెయ్యమని చెప్పండి.

28. Talk to the children about trees. Ask them whether they know the names of any trees near their school or homes. Try to get the children to describe these trees in simple terms. Then get them to do the work on the page. Those who finish early can copy the pictures into their exercise books or on to their slates.

28. పిల్లలతో చెట్ల గురించి మాట్లాడండి. ఇంటి దగ్గర, బడి దగ్గర ఉండే తెలిసిన చెట్ల పేర్లు చెప్పమనండి. ఆ చెట్ల గురించి తేలికైన పదాలలో వివరించమని పిల్లలను అడగండి. తరవాత ఈ పేజీలో కుడి వైపున ఉన్న బొమ్మలను పూర్తి చెయ్యమని చెప్పండి. త్వరగా పూర్తి చేసిన వాళ్లను ఈ బొమ్మలను వాళ్ల పలకల మీద, లేదా నోటు పుస్తకాలలో గీయమని చెప్పండి.

29. Bring six or eight leaves to class. Show them to the children and ask them if they know which trees they have come from. Point out the difference between; say a tamarind leaf and a mango leaf. Then get the children to do the work on the page and copy the leaves into their exercise books or slates.

29. తరగతికి ఆరు గానీ ఏడు గానీ ఆకులు తీసుకుని రండి. వాటిని పిల్లలకు చూపించి అవి ఏ చెట్ల ఆకులో అడగండి. ఉదాహరణకు, చింత ఆకుకీ, మామిడి ఆకుకీ మధ్య తేడాలు చూపించండి. తరవాత ఈ పేజీలో ప్రతి ఆకు బొమ్మనీ పక్కన పూర్తి చేసి, వాటిని తమ పలకల మీద, లేదా నోటు పుస్తకంలో గీయమని చెప్పండి.

30. Ask the children to bring to the class before it begins a collection of stones twigs, leaves and any other bits and pieces which are available. Get the children to make pictures with the things they have brought. Some examples are given on the page, but you and the children will no doubt think of many more things to make.

30. తరగతికి పుల్లలు, ఆకులు, ఇతర చిన్న చిన్న వస్తువులను తీసుకుని రమ్మని పిల్లలకు చెప్పండి. వాళ్లు తెచ్చిన వస్తువులతో బొమ్మలు చెయ్యమని చెప్పండి. కొన్ని ఉదాహరణలను ఈ పేజీలో ఇచ్చాం. మీరు, పిల్లలు ఇంకా చాలా చెయ్యగలుగుతారనటంలో సందేహం లేదు.

31. Show the children how to roll out long snakes of clay and make pots by building up the rolls. As each roll goes on top of the next use a little slip like paste (clay mixed with water) to stick the rolls together. The pots can be smoothed on the outside if the children like to do so.

31. మట్టి ముద్దతో పొడవైన పట్టీ చెయ్యటం చూపించండి. ఆ పట్టీని చుట్టటం ద్వారా కుండలు చెయ్యండి. ఒక వరస మీదకి రెండో వరస వచ్చినప్పుడు మెత్తని మట్టితో ఆ రెండు వరసలనూ అతికించండి. పిల్లలు కావాలనుకుంటే ఆ కుండలను బయటవైపు నుంచి నున్నగా చెయ్యవచ్చు.

32. Before the class ask the children to bring to school some sticks, some stones, some twigs, some leaves, some flowers, some sand and some pebbles. Ask them to work in groups of three or four and to make patterns similar to the ones shown on this page. They can easily do this work outside the classroom- Those who finish early can experiment with new patterns in the shape of a square or a triangle, etc. On the day after this perhaps they can make bigger patterns, four or five children working in a group.

32. బడికి వచ్చేటప్పుడు పిల్లలను పుల్లలు, రాళ్లు, కొమ్మలు, ఆకులు, పువ్వులు, ఇసక, గులకరాళ్లు వంటివి తీసుకుని రమ్మనండి. ముగ్గురు, నలుగురు బృందంగా ఏర్పడి ఈ పేజీలో చూపించినట్టుగా అమరికలు చెయ్యమని చెప్పండి. ఈ పని తరగతి గది బయట తేలికగా చెయ్యగలుగుతారు. తొందరగా పూర్తి చేసినవాళ్లు చతురస్రం, త్రికోణ ఆకారాల్లో అమరిక చెయ్యవచ్చు. రెండు రోజుల తరవాత నలుగురు, అయిదుగురుని కలిసి ఇంకా పెద్ద బొమ్మ చెయ్యమనవచ్చు.

33. Use card if you have it (see Appendix I). If not, you will have to use two or three cigarette packets stuck together. You will also need scissors. Get the children to copy the elephant heads on to card and to cut them out.

33. మీ దగ్గర కార్డుబోర్డు ఉంటే (చూడండి అనుబంధం I) ఉపయోగించండి. అది లేకపోతే రెండు, మూడు సిగరెట్టు పెట్టెలను అతికించాల్సి ఉంటుంది. కత్తెర అవసరం అవుతుంది. కార్డు మీద ఏనుగు బొమ్మ గీసి, కత్తిరించమని పిల్లలకు చెప్పండి.

34. Get the children to copy the pictures on the page.

34. ఈ పేజీలోని బొమ్మలను గియ్యమని పిల్లలకు చెప్పండి.

35. The numbers 4, 5 and 6. Note that the symbols 4, 5, 6 are not yet used.

35. 4, 5, 6 వస్తువులు. 4, 5, 6 సంఖ్యలను ఇంకా పరిచయం చెయ్యలేదన్న విషయం గుర్తించండి.

36. On this page the concept of bigger and smaller is introduced. Talk to the children about big and small. Use some examples. 'My hand is big; your hand is small. Gopal's house is big; Raju's house is small.' Draw a big circle and a small circle on the board. Get them to say big and small when you point to the circles. Get them to draw big and small circles on their slates or notebooks at your dictation. Then get them to do this page. Those who finish early can make more puzzles for their friends.

36. పెద్ద, చిన్న అన్న భావనను ఈ పేజీలో పరిచయం చేశాం. పెద్ద, చిన్న వాటి గురించి పిల్లలతో మాట్లాడండి. కొన్ని ఉదాహరణలు ఇవ్వండి- 'నా చెయ్యి పెద్దది, నీ చెయ్యి చిన్నది. గోపాల్ వాళ్ల ఇల్లు పెద్దది, రాజు వాళ్ల ఇల్లు చిన్నది.' నల్ల బల్ల మీద పెద్ద వృత్తం, చిన్న వృత్తం గియ్యండి. ఆయా వృత్తాలను చూపించినప్పుడు పిల్లలను పెద్ద, చిన్న అనమనండి. మీరు చెప్పినప్పుడు వాళ్ల పలకల మీద, లేదా నోటు పుస్తకంలో పెద్ద, చిన్న వృత్తాలు గియ్యమనండి. తరవాత ఈ పేజీలోని కృత్యం చేయించండి. ముందుగా పూర్తి చేసినవాళ్లు తమ స్నేహితుల కోసం ఇలాంటి మరికొన్ని కృత్యాలను తయారు చేయవచ్చు.

37. Get the children to make a compass as shown on this page. This can be made out of thin card, or out of three or four folds of newspaper. If drawing pins are not available ordinary pins can be used or even thorns. Once children get some practice at drawing circles there are many beautiful designs that they can make, as shown on the page. Colours can also be used. Perhaps the children can make a very large compass like this out of a piece of wood, and use it to mark circles in the playground They can make an even longer compass with two sticks and a piece of string.

37. ఈ పేజీలో చూపించినట్టు వృత్తలేఖిని చేయటం పిల్లలకు నేర్పించండి. పలచటి కార్డు ముక్కతో లేదా దినపత్రికను మూడు, నాలుగు సార్లు మడతపెట్టి దీనిని చెయ్యవచ్చు. డ్రాయింగ్ పిన్నులు లేకపోతే గుండుసూదులు లేదా ముళ్లు కూడా ఉపయోగించవచ్చు. వృత్తాలను గీయటం పిల్లలు సాధన చేసిన తరవాత, ఈ పేజీలో చూపించినట్టు అందమైన డిజైన్లను చేయవచ్చు. రంగులు కూడా ఉపయోగించవచ్చు. చెక్క ముక్కలను ఉపయోగించి పెద్ద వృత్త లేఖినిని తయారు చేసి, దానితో ఆటల మైదానంలో వృత్తాలను పిల్లలు గీయవచ్చు. రెండు కట్టె పుల్లలను తాడుతో కట్టి ఇంకా పెద్ద వృత్త లేఖిని కూడా చేయవచ్చు.

38. A page of pictures to talk about. Ask the children plenty of questions: (What different kinds of clothes do people wear? What different hats have you seen? What kinds of shoes do people wear? Why do people wear clothes? And so on.) Get the children to draw some pictures if they can of people in different kinds of clothing.

38. ఈ పేజీలో బొమ్మల గురించి మాట్లాడండి. పిల్లలను చాలా ప్రశ్నలు అడగండి: (మనుషులు ఎటువంటి బట్టలు వేసుకుంటారు? ఎన్ని రకాల టోపీలను చూశారు? ఎన్ని రకాల చెప్పులు వేసుకున్నారు? మనుషులు బట్టలు ఎందుకు వేసుకుంటారు? మొదలైనవి.) పిల్లలు వేయగలిగితే రకరకాల దుస్తులలో మనుషుల బొమ్మలను వేయమనండి.

39. Get the children to make thumb pots out of clay, as shown in the drawing on the page. They hold a ball of clay in their left hand and push the right thumb into the clay, turning the ball round and round as they do so. These pots can be dried in the shade and then perhaps given to the local potter so that he can fire them in his kiln. They can then be used to hold water

39. ఇక్కడ బొమ్మలలో చూపించినట్టు పిల్లలను బొటనువేలితో మట్టి పాత్రలను చెయ్యమని చెప్పండి. ఎడమ చేతిలో మట్టి ముద్దను పట్టుకుని, మట్టి ముద్దను తిప్పుతూ కుడి చేతి బొటనువేలిని అందులోకి చొప్పించాలి. ఈ కుండలను నీడలో ఎండబెట్టాలి. స్థానికంగా కుండలు చేసే వ్యక్తి ఉంటే, అతనికి ఇచ్చి వాటిని కాల్పించండి. వీటిల్లో నీళ్లు ఉంటాయి.

40. More pictures to copy. These pictures provide a chance for children to observe the position of the arms and legs during various activities. Get one child to come to the front of the class and hold up his arms. Then get the rest of the class to make a drawing of him, similar td the ones on this page.

40. చూసి వెయ్యటానికి మరిన్ని బొమ్మలు. వివిధ పనులు చేస్తున్నప్పుడు కాళ్లు, చేతులు ఎలా ఉంటాయో పరిశీలించే అవకాశం పిల్లలకు దొరుకుతుంది. ఒక అబ్బాయిని తరగతి ముందుకు వచ్చి చేతులు పైకి ఎత్తమనండి. తరగతిలోని మిగిలిన పిల్లలు అతని బొమ్మను ఇక్కడ చూపించిన రీతిలో గీయమనండి.

41. Numbers 7, 8, 9 and 10.

41. అంకెలు 7, 8, 9, 10.

42. Connections. In the two sets of rows, one picture below is connected in some way with the picture in the row above it. For example as the arrow shows, the leaf is connected with the tree. Ask the children to draw fines and arrows showing the connections between the other sets of pictures.

42. సంబంధాలు. పై రెండు వరసలలోని పైనా, కిందా ఉన్న బొమ్మల మధ్య సంబంధాలు ఉన్నాయి. ఉదాహరణగా ఆకునీ, చెట్టునీ కలుపుతూ ఒక బాణం గుర్తు గీసి ఉంది. ఇలాగే మిగిలిన బొమ్మల మధ్య సంబంధాలను గీతలు, బాణాల గుర్తుల ద్వారా పిల్లలను గుర్తించమనండి.

43. Odd-man-out; some of them are more difficult than before.

43. ఒక వరసలోని బొమ్మలలో తేడాగా ఉన్నదానిని గుర్తించండి. ఇంతకుముందు వాటి కంటే ఇవి కొంచెం కష్టంగా ఉంటాయి.

44. Pictures for the children to draw. They can first draw them in the spaces below the pictures, and then try drawing similar pictures in their notebooks or slates.

44. పిల్లలు గియ్యటానికి మరికొన్ని బొమ్మలు. వీటిని వాళ్లు ముందుగా ఆ బొమ్మ కింద ఉన్న డబ్బాలలో గీయమనండి, తరవాత వాళ్ల పలకల మీద, లేదా నోటు పుస్తకాలలో గీయమనండి.

45. Children can copy the patterns shown in the spaces provided. Some of the children may find this difficult because it involves more difficult spatial relationships. If you can see after most of the class have done one or two of the easier ones at the top of the page, that the children are finding it difficult, draw more easy ones on the board. Let them copy these correctly before they go on to do the work of this page.

45. పైన ఉన్న నమూనాని కింద ఉన్న ఖాళీలో పిల్లలను గీయమనండి. వీటిల్లోని స్థల సంబంధాలు క్లిష్టమైనవి కాబట్టి వీటిని గీయటం కొంతమంది పిల్లలకు కష్టం కావచ్చు. పేజీలో పై భాగంలోని తేలిక వాటిల్లో ఒకటి, రెండు బొమ్మలను పిల్లలు గీసిన తరవాత చూడండి. పిల్లలు ఇబ్బంది పడుతుంటే ఇంతకంటే తేలికైన నమూనాలను నల్ల బల్ల మీద గీయండి.

46. Ask the children if they can bring one or two coins with them to the class. One, two, five or ten paisa. You should also provide yourself with some coins in case the children cannot bring any. Get the children to .make some of the patterns shown on the page and to make up new ones on their own,

46. పిల్లలను ఒకటి, రెండు నాణాలను (ఒకటి, రెండు, ఐదు, పది పైసలు) తరగతికి తీసుకుని రమ్మనండి. పిల్లలు తీసుకుని రాని పక్షంలో మీరు వాటిని ఏర్పాటు చెయ్యండి. ఇక్కడ చూపించిన ప్యాట్రన్ల తోపాటు కొన్నిటిని పిల్లలను సొంతంగా గీయమనండి.

47. For completing this page follow the same instructions as given in page 45.

47. 45వ కృత్యానికి ఇచ్చిన సూచనల ఆధారంగా ఈ పేజీని కూడా పూర్తి చెయ్యాలి.

48. By now the children will have learnt to write a certain number of words. Let them fill in the blanks on the picture if they can. If they cannot you will have to demonstrate writing the words a few times on the blackboard; then get the children to write a few times on the blackboard; then get the children to write them in their exercise books or slates. Those who finish early can copy the pictures into their exercise books or slates.

48. ఈపాటికి పిల్లలకు కొన్ని పదాలను రాయటం వచ్చి ఉంటుంది. కింది బొమ్మలోని ఖాళీలను నింపగలుగుతారేమో చూడండి. పిల్లలు వీటిని రాయలేకపోతుంటే వాటిని ఎలా రాయాలో నల్ల బల్ల మీద మీరు కొన్నిసార్లు రాసి చూపించండి. పిల్లల తోటి కూడా నల్ల బల్ల మీద కొన్నిసార్లు అభ్యాసం చేయించి తరవాత పలక మీద లేదా నోటు పుస్తకంలో రాయమనండి. వీటిని త్వరగా పూర్తి చేసినవాళ్లను పలక మీద లేదా నోటు పుస్తకంలో ఈ బొమ్మను గీయమనవచ్చు.

49. Make sure that the children can discriminate between the different figures at the bottom of the page. You may have to draw these on the blackboard for the benefit of the children before they do the work on the page.

49. కింద ఉన్న బొమ్మలలోని తేడాలను పిల్లలు గుర్తించారని నిర్ధారించుకోండి. అవసరమైతే వీటిని నల్ల బల్ల మీద గీసి చూపించండి. ఈ పేజీలోని కృత్యాన్ని పిల్లలను పూర్తి చెయ్యమనండి.

I am a girl నేను అమ్మాయిని.

..........................................................................

My name is Uma. నా పేరు ఉమ.

..........................................................................

I live in India. నేను భారత దేశంలో ఉంటాను.

..........................................................................

India is my country. భారత దేశం నా మాతృదేశం.

..........................................................................

50. You will know whether the children can do this on their own or not. If they cannot then you help them by writing similar sentences on the blackboard.

50. వీటిని పిల్లలు సొంతంగా చెయ్యగలుగుతారో లేదో మీకు తెలుస్తుంది. ఒక వేళ రాయలేకపోతుంటే ఇటువంటి వాక్యాలనే నల్ల బల్ల మీద రాసి సహాయ పడండి.

I am a boy. నేను అబ్బాయిని.

..........................................................................

My name is Krishna నా పేరు కృష్ణ.

..........................................................................

I live in India. నేను భారత దేశంలో ఉంటాను.

..........................................................................

India is my country. భారత దేశం నా మాతృ దేశం.

..........................................................................

51. You will know whether the children can do this on their own or not. If they cannot then you help them by writing similar sentences on the blackboard.

51. ఈ కృత్యాన్ని పిల్లలు సొంతంగా చెయ్యగలుగుతారో లేదో మీకు తెలుస్తుంది. వాళ్లు చెయ్య లేక పోతుంటే ఇటువంటి వాక్యాలనే నల్ల బల్ల మీద రాసి అభ్యాసం చేయించండి.

52. Odd-man-out, more difficult this time. Those who finish early can make more odd-man-out puzzles of this kind and try them on their friends.

52. వేరుగా ఉన్నదానిని గుర్తించటం ఈసారి ఇంకా కష్టంగా ఉండవచ్చు. తొందరగా పూర్తి చేసినవాళ్లు ఇలాంటి మరికొన్ని సమస్యలు తయారు చేసి వాళ్ల స్నేహితులకు ఇవ్వవచ్చు.

53. More difficult patterns.

53. మరింత కష్టమైన ప్యాట్రన్లు.

54. Letters to be written, for the first time, in the spaces provided. If children have learnt all the letters they can make up similar puzzles and give them to their friends.

54. ఇచ్చిన ప్రదేశంలో అక్షరాలను మొదటిసారి రాయించటం. ఇవి నేర్చుకున్న పిల్లలు ఇటువంటి సమస్యలను తయారుచేసి తమ తోటి పిల్లలకు ఇవ్వవచ్చు.

55. More difficult discrimination exercises.

55. తేడాలను గుర్తించటానికి మరింత క్లిష్టమైన అభ్యాసం.

I can hear the rain.
వాన చప్పుడు వింటాను.

56. Ask the children to look at the page, then read it aloud and get them to read it. Perhaps some of the children in the class can imitate these or other sounds. Get them to try making the sounds which animals make — dogs, ducks, chickens, etc. Then get them to copy the sentences into the spaces provided.

56. ఈ పేజీని చూడమని పిల్లలకు చెప్పండి. ముందు మీరు చదివి తరవాత పిల్లలను చదవమనండి. తరగతిలోని కొంతమంది పిల్లలు ఈ శబ్దాలు, కొన్ని ఇతర శబ్దాలను అనుకరించగలుగుతారు. కుక్క, బాతు, కోడి వంటి జంతువులు చేసే శబ్దాలను అనుకరించమని అడగండి. కింది ఇచ్చిన ఖాళీలలో ఈ వాక్యాలను తిరిగి రాయమనండి.

58. More difficult spatial relationships. If the children find these too hard you will have to draw some easier ones on the blackboard. Get the children to work on these before they start work on the page.

58. మరింత క్లిష్టమైన స్థల సంబంధాలు. ఇవి చెయ్యటం పిల్లలకు కష్టంగా ఉంటే మరింత తేలికైనవి నల్ల బల్ల మీద గీయండి. అవి పూర్తి చేసిన తరవాత ఈ పేజీలోనివి చేయించండి.

59. Join bits to wholes see page 13.

59. భాగాలను వాటికి సంబంధించిన వాటితో జోడించండి. 13వ కృత్యం చూడండి.

60. The symbols for the numerals introduced for the first time.

60. అంకెల గుర్తులు మొదటిసారి పరిచయం చెయ్యటం.

61. More difficult shading exercises. In this exercise some of the figures are rotated. Children should be shown that the figures are the same even if they are not upright.

61. నలుపు రంగు అద్దడానికి మరింత క్లిష్టమైన కృత్యాలు. ఈ అభ్యాసంలో కొన్ని బొమ్మలు తిప్పి ఉన్నాయి. నిలువుగా లేనప్పటికీ ఇవి కూడే అవే బొమ్మలని పిల్లలకు చెప్పాలి.

62. Talk about various smells before the children do the work on this page. Get them to tell you which smell they like, which they don't, how many smells they can remember. Can they all tell what is being cooked before they actually see it? Then get them to write the words in the spaces provided and copy the pictures on their slates or notebooks. (See also Appendix II for more work on smells.)

62. ఈ పేజీలోని కృత్యం చెయ్యటానికి ముందు రకరకాల వాసనల గురించి పిల్లలతో మాట్లాడండి. వాళ్లకి ఏ వాసన ఇష్టమూ, ఏ వాసన ఇష్టం లేదో, ఎన్ని వాసనలు గుర్తుపెట్టుకోగలరో చెప్పమనండి. చూడటానికి ముందే ఏమి వండుతున్నారో చెప్పగలరా? తరవాత, కింద ఉన్న ఖాళీలో పై వాక్యాలను రాయించండి. ఈ బొమ్మలను పలక మీద లేదా నోటు పుస్తకంలో గీయమనండి.

I taste with my tongue. నేను నాలుకతో రుచి చూస్తాను.

I can taste a lime. నిమ్మ రుచి చూస్తాను.

I can taste a vadai. గారె రుచి చూస్తాను.

I can taste a banana. అరటిపండు రుచి చూస్తాను.

I can taste a laddu. లడ్డు రుచి చూస్తాను.

63. Deal with this in the same way as you did with page 62. Plenty of questions are necessary before children write on the page.

63. 62వ కృత్యం చేసినట్టే ఇది కూడా చెయ్యండి. పుస్తకంలో రాయటానికి ముందు పిల్లలను చాలా ప్రశ్నలు అడగాలి.

64. Talk to the children about different kinds of fruit which are available. Perhaps you could tell them something of fruits which are not available and which they have never seen. Then get them to trace over the dots on page 65 and write in the names of the fruits.

64. అందుబాటులో ఉన్న రకరకాల పళ్ల గురించి పిల్లలతో మాట్లాడండి. అందుబాటులో లేని, వాళ్లు ఎప్పుడూ చూడని పళ్ల గురించి మీరు కొంచెం చెప్పవచ్చు. తరవాత పేజీలోని చుక్కల ఆధారంగా గీతలు గీసి, వాటి పేర్లు కింద రాయాలి.

65. See page 64 for instructions.

65. 64వ కృత్యంలోని సూచనలు చూడండి.

I feel with my hand. నేను చేతితో స్పర్శ తెలుసుకుంటాను.

...........................................................................

I can feel wood. నాకు చెక్క స్పర్శ తెలుస్తుంది.

...........................................................................

I can feel water. నాకు నీటి స్పర్శ తెలుస్తుంది.

...........................................................................

I can feel stone. నాకు రాయి స్పర్శ తెలుస్తుంది.

...........................................................................

66. Talk to the children about feeling, especially with their fingers and toes. Ask them what kind of surface they like to walk over. Then get them to give you some words used when they feel things, e.g. hard, soft, and smooth, etc. Then get them to write the sentences on the page. The hand at the top is copied from Michelangelo.

66. స్పర్శ గురించి, ప్రత్యేకించి చేతి వేళ్లు, కాలి వేళ్లతో తెలుసుకునే స్పర్శ గురించి పిల్లలతో మాట్లాడండి. ఏ రకమైన ఉపరితలం మీద నడవటం వాళ్లకి ఇష్టమో అడగండి. ఆ స్పర్శానుభూతిని తెలియచేసే కొన్ని పదాలను మీకు చెప్పమనండి, ఉదాహరణకి మెత్తగా, గట్టిగా, మృదువుగా. తరవాత పై వాక్యాలను వాటి కింద రాయించండి. పైన ఉన్న చెయ్యి బొమ్మ మైకేల్‌ఆంజిలో వేసినది.

67. Numerals 4, 5 and 6.

67. 4, 5, 6 అంకెలు.

68. Instructions similar to those on pages 64 and 65.

68. 64, 65 కృత్యాలలోని సూచనలు పాటించండి.

69. Same instructions as on page 68.

69. 68వ కృత్యంలోని సూచనలు పాటించండి.

70. Talk to the children about various crops which are grown near your school and perhaps, about other crops which are grown in different parts of the country Get them to bring you samples of seeds of some crops when they come to class next day,

70. మీ బడి దగ్గర పండించే పంటల గురించి, దేశంలోని వివిధ ప్రాంతాలలో పండించే పంటల గురించి పిల్లలతో మాట్లాడండి. మరునాడు బడికి వచ్చేటప్పుడు కొన్ని పంటల విత్తనాలను తీసుకుని రమ్మని పిల్లలకు చెప్పండి.

71. Numerals 7, 8, 9 and 10.

71. 7, 8, 9, 10 అంకెలు.

72. Talk to the children about shells, and, if you live near the sea, get the children to collect some. Show them coloured pictures if possible. Then get them to trace over the lines on page 73.

72. నత్తగుల్లలు, ఆల్చిప్పల గురించి పిల్లలతో మాట్లాడండి. మీరు సముద్రానికి దగ్గరలో ఉంటే కొన్ని గుల్లలను సేకరించమని చెప్పండి. సాధ్యమైతే వీటి రంగుల బొమ్మలు పిల్లలకు చూపించండి. 73వ కృత్యంలోని చుక్కల వెంట వీటి బొమ్మలు గీయమనండి.

73. See instructions on page 72 and ask the children to complete this page.

73. చుక్కలను కలుపుతూ బొమ్మలను గీయమనండి.

74. Ask the children about birds they see on the way to school or near their homes. See if they recognize any birds shown on the page. See if they can describe in detail other birds they may have seen. Then get them to trace over the dots on page 75 and write in the names of the birds.

74. బడికి వచ్చే దారిలో లేదా ఇంటి దగ్గర పిల్లలు చూసే పక్షుల పేర్లు చెప్పమనండి. ఈ పేజీలోని బొమ్మలను వాళ్లు గుర్తుపడతారేమో చూడండి. వాళ్లు చూసిన ఇతర పక్షుల గురించి వివరంగా చెప్పగలుగుతారేమో చూడండి. 75వ కృత్యంలోని బొమ్మలను గీసి వాటి కింద వాటి పేర్లు రాయమనండి.

75. See page 74 for instructions.

75. 74వ కృత్యంలోని సూచనలు చూడండి.

76. Talk to the children about animals that they may have seen and also animals which they can see in their own environment. Then ask them to look at the rather strange animals on this page. Tell them all about each animal and get them to trace over the dots and complete the pictures (tiger giraffe, zebra and rhinoceros).

76. వాళ్లు చూసిన జంతువులు, వాళ్ల పరిసరాలలోని జంతువుల గురించి పిల్లలతో మాట్లాడండి. తరవాత ఈ పేజీ లోని కొత్త జంతువులను చూడమనండి. ఈ జంతువుల గురించి చెప్పి, చుక్కలను కలుపుతూ బొమ్మలు గీయమనండి (పులి, జిరాఫీ, చారల గుర్రం, ఖడ్గమృగం).

77. See if the children know the names of any trees in their environment. See if they can describe the leaves, the fruit and the flowers. Perhaps you can get them to make a collection of leaves from trees they know the names of. Then tell them the names of the trees on this page.

77. తమ పరిసరాలలోని చెట్ల పేర్లు ఏమైనా పిల్లలకు తెలుసేమో అడగండి. వాటి ఆకులు, పువ్వులు, కాయల గురించి చెప్పగలరేమో చూడండి. వాళ్లకి పేర్లు తెలిసిన చెట్ల ఆకులను సేకరించమని చెప్పవచ్చు. తరవాత ఈ పేజీలోని చెట్ల పేర్లు చెప్పండి.

# APPENDIX I

Clay: If you have a potter near your school you ought to be able to persuade him to let you have some clay for the school occasionally. If you ask him nicety he will probably mix it for you ready to use. Otherwise you may have to mix it yourself, if you can get dry clay. If you are making pottery for firing in kilns, mixing clay is one of the most important parts of the whole process and has to be done very carefully. However, the children are only going to use the clay for making models which may not be fired in a kiln and so the mixing need not be done so carefully. Hit the lumps of clay with a hammer or a piece of wood until you have broken up all the clay into very small pieces. Then pour some water over it, not too much, and leave for a few hours. Mix it up as though you are mixing dough for chapattis. Before using it the children should mix it again themselves. If you find this difficult you may be able to get the potter to come to the school and demonstrate the mixing of clay for you and for the children.

Paste: Paste is easily made by mixing *maida* flour with water. Mix the flour into the water until it gets the consistency of thick curds. Then put the vessel containing the mix over a fire and let it simmer for about five minutes; it should not boil too fast. It is ready for use as soon as it cools. This paste can be used for sticking card and paper together, for sticking flowers and leaves into books and for making paper chains etc. If you want to improve its keeping quality you can mix in a little oil of cloves.

Colour: If you have any money the best paints to buy are poster paints, sold in small pots; but they are expensive. The next alternative is to buy powder .colours. There are two kinds. There are pale powders used for mixing into whitewash to make it into a colour-wash. There are also powder colours used by ladies to put on their foreheads. Do not mix these powders with water but mix them with paste. If you are giving individual children colours, the best things to put them in are the small earthen lamps (deepas) which are sold at Diwali time; but any other containers such as tins, bottle tops, leaves or even pieces of paper, can be used if you cannot buy lamps. The young children you have in your class are not expected to have brushes, but if they can buy their own brushes they will be very useful for a variety of jobs.

Cardboard: You will sometimes need to use cardboard in the class; for example, on page 21 you are asked to make snap cards. If you have funds for buying cardboard, buy the large sheets of coloured card used for making file covers. If you cannot obtain or afford this kind of cardboard, you can make your own. You can make serviceable cardboard, by sticking old cigarette packets together or old post-cards. They can then be covered with white paper. If you are not able to collect old cigarette packets, the children can collect them for you. If there are no cigarette packets you can make quite good cardboard by sticking layers of paper, (old newspaper, for example) one on top of the other, with paste until the required thickness is obtained.

## అనుబంధం I

మట్టి: మీ బడికి దగ్గరలో కుండలు చేసే వ్యక్తి ఉంటే అతనిని కొంచెం మట్టి ఇవ్వమని అప్పుడప్పుడు అడుగుతుండవచ్చు. మీ మధ్య సంబంధాలు బాగుంటే మట్టిని కలిపి ఇవ్వమని అతనినే అడగవచ్చు. లేదంటే పొడి మట్టి తీసుకుని మీరే కలుపుకోవాల్సి ఉంటుంది. మట్టితో వస్తువులు చేసిన తరవాత వాటిని కాల్చాలనుకుంటే ఈ ప్రక్రియ మొత్తంలో మట్టి కలపటం చాలా ముఖ్యమైనది కాబట్టి దానిని ఎంతో జాగ్రత్తగా చెయ్యాలి. అలా కాకుండా కాల్చనవసరం లేని బొమ్మలను పిల్లలు తయారుచేస్తుంటే అప్పుడు మట్టిని అంత జాగ్రత్తగా కలపాల్సిన అవసరం లేదు. పొడి మట్టి పొడుం పొడుం అయ్యేంతవరకు సుత్తితో లేదా కర్రతో బాగా కొట్టండి. తరవాత మరీ ఎక్కువ కాకుండా నీళ్లు పోసి కొంచెం సేపు అలా ఉంచండి. తరవాత రొట్టెలకు పిండి కలుపినట్టుగా దానిని బాగా కలపండి. దానిని వాడుకోటానికి ముందు పిల్లలు మరోసారి కలుపుకోవాలి. ఇదంతా మీకు కష్టంగా అనిపిస్తే, కుండలు చేసే వ్యక్తిని మీ బడికి పిలిచి మట్టిని ఎలా కలపాలో మీకు, మీ పిల్లలకు చూపించమని అడగండి.

మైదా బంక: మైదాకి నీళ్లు కలిపి తేలికగా జిగురు చేయవచ్చు. పెరుగు లాగా చిక్కగా ఉండేలా మైదాకి నీళ్లు బాగా కలపండి. తరవాత ఈ పాత్రని మంట మీద ఉంచి అయిదు నిమిషాల పాటు మెల్లగా ఉడికించండి. ఎక్కువ మంట మీద మరిగించకూడదు. చల్లారిన తరవాత దీనిని జిగురు లాగా ఉపయోగించవచ్చు. అట్టముక్కల మీద కాగితం అంటించటానికి , పుస్తకంలో ఆకులు, పూలు అతికించటానికి, కాగితపు దండ చెయ్యటానికి ఇది ఉపయోగపడుతుంది. ఇది ఎక్కువ రోజులు ఉపయోగపడాలంటే లవంగ నూనెను కలపాలి.

రంగులు: మీరు రంగులు కొనాలనుకుంటే పోస్టర్ పేంట్స్ మంచివి, కానీ చాలా ఖరీదైనవి. రంగు పొడులు వీటి కంటే తక్కువకు దొరుకుతాయి. ఇందులో రెండు రకాలు ఉన్నాయి. మొదటిది సున్నం నీళ్లలో కలిపి రంగులు వెయ్యటానికి ఉపయోగించేవి. రెండవ రకం నీళ్లో కాకుండా మైదా బంకలో కలుపుకోవాలి. ఒక్కొక్క పిల్లవాడికి రంగులు ఇస్తున్నట్లయితే ప్రమిదలో పెట్టి ఇవ్వటం మంచిది. అయితే ప్రమిదలే కాకుండా ఏదైనా సీసాలో, పాత్రలో, కాగితపు ముక్కలో కూడా పెట్టి ఇవ్వవచ్చు. మీ తరగతిలోని చిన్న పిల్లల దగ్గర బ్రష్షులు ఉండాలని లేదు. కానీ ఎవరైనా కొనుక్కోగలిగితే అనేక రకాల పనులకు ఇవి ఉపయోగపడతాయి.

అట్టముక్క: అట్టముక్కతో మీకు అప్పుడప్పుడు పని పడుతుంది. ఉదాహరణకు 21వ కృత్యంలో స్నాప్ కార్డులు చెయ్యాలి. మీరు కొనగలిగితే పెద్ద గుల చార్ట్ షీట్లు కొనండి. ఒకవేళ వాటిని కొనలేకపోతే సిగరెట్టు పెట్టెలు, పోస్ట్ కార్డులను అంటించే వీటిని తయారు చేసుకోవచ్చు. ఆ తరవాత వాటి మీద తెల్ల కాగితం అంటించుకోవచ్చు. పాత సిగరెట్టు పెట్టెలు మీరు సేకరించలేకపోతే పిల్లలను సేకరించమనండి. అదీ సాధ్యం కాకపోతే మైదాతో దినపత్రికలను పొరలు పొరలుగా అంటించి కావలసినంత మందం వచ్చేలా చూసుకోవచ్చు.

## APPENDIX II

Card Games: The cards shown in the book on page 21 can be used for a number of games. Here are two of them:

A. Snap: This game can be played with from two to four players. An equal number of cards is given to each player. Each player keeps them face downwards in front of him. The first player turns up a card and puts it in front of his pack. Next, the second player does the same. If the two cards are the same the players should shout Snap. Whoever shouts first takes them both and adds them to his pack, at the bottom. Then the next player puts a card down, and so on round the circle. A player can only say Snap if the card that he turns up is the same as the last card turned up by the player on his right. Whoever collects all the cards at the end is the winner.

B. Pelmanism: The cards are well mixed and placed face-downwards on the floor. No card must be covering another card. Up to five players can play, and they sit in a circle round the cards. The first player turns up one card and then another card. If they are the same he keeps them and turns up two more. If they are not the same he turns them over again face downwards in exactly the same places as they were in before. He must not put them down in any other place on the floor. Then the next player has a turn and turns up two more cards. Of course the skill in the game depends on the child's ability in remembering which cards have been turned up, so that, for example, if he turns up a square with his first card he can remember that somebody else turned up a square some little distance away. If he can remember exactly where it is he can turn up the second square and take up both the cards.

Smells: A game for practising smelling can easily be made as follows. Get some small bags of plain cloth. You can sew these up by yourself or get the tailor to do so. Into each bag put a few pieces of something that smells strongly pepper, cardamom, garlic or whatever you like. Tie-up the bags securely. The bags can then be put on the table with a number by the side of each. Children can then try to guess what is in each bag. tt is better to write the numbers on separate slips of papers; if the numbers are written on the bags children are sometimes able to remember the numbers rather than the smells.

END

## అనుబంధం II

కార్డులతో ఆటలు: 21వ కృత్యంలో చూపించిన కార్డులతో అనేక రకాల ఆటలు ఆడవచ్చు. ఇక్కడ రెండు ఆటలు ఇస్తున్నాం:

అ. స్నాప్: ఈ ఆటను ఇద్దరు లేదా నలుగురు ఆడవచ్చు. ఆడుతున్న అందరికీ కార్డులు సమానంగా పంచాలి. వాళ్లు ఆ కార్డులను తమ ముందు బొమ్మ కనపడకుండా కింద పెట్టాలి. ముందుగా ఒక వ్యక్తి తన కార్డుల లోనుంచి పైదానిని బొమ్మ కనపడేటట్టు తిప్పి ముందు పెట్టాలి. తరవాత వారికి ఎడమవైపున వ్యక్తి అలాగే చెయ్యాలి. రెండు కార్డులలో బొమ్మ ఒకటే అయితే స్నాప్ అని అరవాలి. తనకు ముందు (కుడివైపున ఉన్న) వ్యక్తి వేసిన కార్డులోని బొమ్మతో తాను వేసిన కార్డులోని బొమ్మ సరిపోలితే స్నాప్ అని అరవాలి, ఆ కార్డులన్నింటినీ తీసుకుని తమ కార్డుల కింద పెట్టుకోవాలి. ఆ తరవాత ఆట మళ్లీ కొనసాగుతుంది. అలా కార్డులన్నీ తన దగ్గరకు చేరిన వ్యక్తి ఆట గెలిచినట్టు.

ఆ. జంట కార్డులు (పెల్మానిజం): కార్డులను బాగా కలిపి ఒక దాని మీద ఒకటి లేకుండా బొమ్మ కనపడకుండా తిప్పి కింద పెట్టాలి. ఈ ఆటను అయిదుగురు వరకు ఆడవచ్చు, వాళ్లు ఆ కార్డుల చుట్టూ గుండ్రంగా కూర్చోవాలి. ముందుగా ఒక వ్యక్తి, ఒక దాని తరవాత ఒకటి రెండు కార్డులు తియ్యాలి. ఆ రెండూ ఒకే రకమైన కార్డులయితే అవి వారికి చెందుతాయి. అలా కాకపోతే వాటిని తిరిగి అక్కడే పెట్టెయ్యాలి, వాటి స్థలం మార్చకూడదు. తరవాత వ్యక్తి రెండు కార్డులు తెరవాలి. ముందుగా ఒక కార్డు తెరిచి అందులో చదరం ఉంటే అంతకుముందు చదరం తీసి తిరిగి ఎక్కడ పెట్టారో గుర్తు పెట్టుకోవటం మీద ఈ ఆటలో నైపుణ్యం ఆధారపడి ఉంటుంది.

వాసనలు: వాసనలు తెలుసుకోవటం బాగా అలవాటు చేసుకోటానికి తేలికైన ఆటను ఈ విధంగా ఆడించవచ్చు. తెల్లటి గుడ్డతో చిన్న చిన్న సంచులు కుట్టండి లేదా బట్టలు కుట్టేవాళ్లతో కుట్టించండి. బాగా వాసన వచ్చే మిరియాలు, దాల్చిన చెక్క, వెల్లుల్లిపాయ వంటివి ఆ సంచులలో పెట్టి కట్టండి. ప్రతి సంచి పక్కన దాని సంఖ్యని తెలియచేసే కాగితం ఉంచండి. ఏ సంచిలో ఏముందో వాసన చూసి పిల్లలు తెలుసుకోవాలి.

సమాప్తం